“యా ద్దీక్షితపద్ధతిః”

స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః.

# నియోగీశ్వరము

## (దీక్షితశతకము)

గ్రంథకర్త:

అచ్యుతుని వేంకటాచలపతిరావు.



ప్రథమముద్రణము ౧౦౦౦ ప్రతులు.

స్వధర్మప్రవర్తకులును శ్రీ దీక్షితప్రశిష్యులును నగు
శ్రీ ద్వైతాద్వైతమతస్థాపక, కోటీశ్వర దీక్షితులవారిచే
ప్రకటింపఁబడియె.

బెజవాడ, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
బ్రి॥ కర్లపాలెము కోదండరామశర్మగారిచే ముద్రింపఁబడియె.

 1931. [మూల్యము రు 0—4—0.

దీక్షిత సంవత్ ౧౧౨.

# శ్రీ దీక్షితచరిత్రవివరము

౧ శ్రీ దీక్షితశిష్యపంచకములోఁ జేరిన శ్రీరం కోటీశ్వర శాస్త్రులవారిచేఁ వ్రాయబడ్డ సంస్కృతమున — గురుదిగ్విజయము

౨ బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారిచే నాంధ్రమునందు వచనకావ్యము — శ్రీ దీక్షితచరిత్ర

3 మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నకవి విరచితము, పద్యకావ్యము (బ్ర॥ నందపాటి లక్ష్మీనారాయణశర్మచేఁ బ్రకాశితము) — నియోగివిజయము

౪ బ్రహ్మశ్రీ పులిపాక పూర్ణయ్య పంతులవారిచే ఆంగ్లమున సమగ్రము — శ్రీ దీక్షితచరిత్ర

౫ బ్రహ్మశ్రీ నారపరాజు లక్ష్మీకాంతకవి విరచితము ఆంధ్రమున ఆఱంకముల నాటకము — స. ౧. విజయము

౬ బ్రహ్మశ్రీ అబ్బరాజు హనుమంతరాయశర్మ కృతము ఆంధ్రమున పద్యకావ్యము (బ్ర॥ చోడవరపు వేశశేరాజుశర్మ పాకయాజి ప్రకాశితము) — శ్రీ దీక్షితచరిత్ర

౭ బ్ర॥ నందివాడ జగన్నాథకవి విరచితము — శ్రీ దీక్షితహారికథ

౮ బ్ర॥ అచ్యుతుని వేంకటాచలపతిరాయకవి విరచితము — నియోగీశ్వరము

౯ బ్ర॥ గన్నవరం వేంకటరాయశర్మ కవి విరచితము — శ్రీ దీక్షితశతకము

౧౦ బ్ర॥ వఝ్ఝ సూర్యనారాయణ కవి విరచితము — శ్రీ దీక్షితశతకము

౧౧ మహామహోపదేశక అప్పాశర్మకవికృత సంస్కృత — చిదానందశతకము

[౪-౫-౭-౯-౧౦ ఈ సంఖ్యలవి ముద్రితము కాఁగలయును.]

స్వసంఘమునందు అనేకసత్కవులు దీక్షితులవారిని గురించి ఆంధ్రమునను సంస్కృతమునను అష్టకములు నవరత్నములు పంచరత్నములు నియోగిరత్నభూషణము అనునవి మొత్తం ౫-౬ వందల పద్యములు గలవు. క్రమక్రమమున అన్నిటినిఁ జేర్చి గ్రంథరూపమున ముద్రించి స్వశిష్యుల కంపఁ జేయు దృఢసంకల్పము గలదు. పరమేశ్వరుండు మా సత్సంకల్పమును సఫలీకృతము చేయుఁగాక.

కృష్ణాతీరం, దుర్గాక్షేత్రం,
చిదానందాశ్రమం, బెజవాడ,
ప్రజాపతి భాద్రపద శుక్ల చతుర్థి.

ఇట్లు దీక్షితశిష్యుఁడు,
శ్రీ వై॥ మ॥ కోటీశ్వరదీక్షితులు.

20-3-73

ఓమ్



# తొలిపలుకు

## మతోద్ధారకులు.

శ్రీమద్భరతవర్షమని ప్రశస్తిగాంచిన యీ మనపుణ్యభూమియందు ఎన్నెన్నియో మతము లుద్భవించినవి. తత్తన్మతస్థాపనార్థమై యెందరెందరో మతగురువు లుదయించి యస్తమించి యున్నారు. అట్టి మతగురువులలోఁ గొందఱు ఒక్కొక్క శాఖనే యుద్ధరించుట కవతరించినవారై యున్నారు. ఈ శాఖోద్ధారకులందు బ్రహ్మశ్రీ నందిరాజు లక్ష్మీనారాయణదీక్షితులవారుఁ గూడ నొకరు. కొందఱు నియోగు లాత్మజ్ఞానశూన్యులై వైదికపథచ్యుతిచేఁ జిత్తశుద్ధి కోలుపడి కడుంగడు దీనదశల నల్లాడుచున్నప్పుడు దీక్షితులవారు వారల కాత్మతత్త్వము నెఱింగించి సత్పథమునందుఁ బ్రతిష్ఠించి శ్రోత్రియులఁ గావించిరి గాన వీరిని నియోగులందఱుం దమశాఖోద్ధారకులుగ భావించుట యం దేమి వింత? కాన వీరే నియోగీశ్వరులు. సాధారణమతోద్ధారకుల కందఱకుం బలె వీరలకుంగూడఁ బ్రతికక్షిసంఘర్షణ మనివార్యము లయ్యెను. అయ్యది సార్వత్రికమగు సామాన్యవిధి కాఁబోలు! వీరి చరిత్రలోఁ గొన్ని ఘట్టములు సాక్షాత్ శ్రీశంకరాచార్యులవారి చరిత్రలోని సారాంశములతో సరితూగుచున్నవి.

## కక్షలు.

ప్రాయికముగ నొకమతము ప్రబలమగునప్పు డింకొకమతము దుర్బలమగుట సర్వసాధారణము. ఆకాలమునం దట్టి మతోద్ధారకులకు విరోధు లొకకొందఱుండుట లోకధర్మమే. దానం జేసి యొక్కెడ మతగురువులు కొంతకొంత ప్రాణాపాయమునకుంగూడఁ బాల్పడవలసియుండును. శ్రీ శంకరుల

వారిని గాలభైరవుఁడు వధింపసమకట్టినరీతి వీరిచరితలోఁగూడ "ధృష్టద్యుమ్నవధ" మొందు గన్పించుచున్నది. ఇంతయేల? వేదములో సైతమక్కడక్కడ నిందుని దూషించువా రున్నట్లు కన్పట్టుటలేదో! కావున మతోద్ధారకుల యెడ వైర మాయాకాలములందుండుట సహజమే కాని వీ రిటీవలివా రగుటం జేసి యీనాఁటికి సైతము కక్షలు నిలిచియుండుట తటస్థించుచున్న; దదియు శోచనీయమే. ఎట్లనఁ బ్రతిసంఘమునకుంగూడ స్వాత్మసంస్కరణముల కన్ని యధికారములు కలవుకదా! దాని కితరులు సంతసింపవలసినదే కాని ద్వేషించు టేమి ధర్మము? కట్టా! ఇయ్యదనివార్యదైవసంఘటన కాఁబోలు!

## గ్రంథరచన.

ఈ శతకగ్రంథము వ్రాయ నన్ను నియమించిన శ్రీ॥ వై॥ మ॥ కోటీశ్వరదీక్షితులవారి నిదేశబద్ధుండనై యేకప్రాసము నేకవృత్తము జరిత్రాత్మకత్వము వీని నెట్లో తరించి మధ్యమధ్య వచ్చిన గ్రంథనష్టములకోర్వాటించి బ్రహ్మశ్రీవారు నాకొసంగినగడువులోనే యీగ్రంథముఁ బూర్తిం గావించితిని; కాని నే నీ శతకము వ్రాయుటకుఁ దగినవారలలో నగ్రగణ్యుఁడనేమో యని లోలోన జంకువొడముచున్నది. శ్రీ దీక్షితులవారి యాజ్ఞాదృఢబంధమునఁ దగుల్కొని నా వాగ్దత్తమునుండి వెనుదీయుట కాపురుషలక్షణమని యీ సాహసమునకు మొగ్గతిలంబడితినే గాని నాశక్తిసామర్థ్యములపై నాధారపడి యీపని కొప్పికొనలేదుగాన పాఠకమహాశయులు నన్ను క్షమింతురుగాక!

ఇట్లు
బుధజనవిధేయుఁడు,

గుంటూరు,
ప్రజోత్పత్తి భాద్రపదశుక్ల
వినాయకచతుర్థి.

అచ్యుతుని వేంకటాచలపతిరావు,
గ్రంథకర్త.

ద్వైవాద్వైతమతస్థాపకారిణం దీక్షితం గురుం
వందే కోటీశ్వరం శశ్వత్కాశ్యపం శ్రౌతపారగం॥



శ్రీ॥ ద్వై॥ మ॥ కోటీశ్వరదీక్షితులు,
శ్రీ దీక్షితవిలాసమ్, బెజవాడ.

ప్రకాశకులు.



గ్రంథకర్త:
అచ్యుతుని వేంకటాచలపతిరావు.

ఓమ్

శ్రీమద్గురుభ్యో నమః



# అంకితము.

శ్లో॥ ఓమిత్యేకాక్షరం వందే సచ్చిదానందవిగ్రహం
అచ్యుతాచల మీశానం బ్రహ్మానందయతీశ్వరం.

శ్లో॥ శ్రీపాదరాజం విమలం విరాజం
ఆనందభాజం శశిసూర్యభాజం
జ్ఞానం దదానం జగతాం నిదానం
వందే యమీశం ధుతమాయ మీశం.

శ్లో॥ యస్యాలోకనచంద్రికా విదళితుం శక్నోతి మోహాంధతాం
యస్యోదారవచస్సుధా మనుభవన్ మూకః ప్రవక్తా భవేత్
యస్యానందమయై రిదం భువలయం ప్రాబోధి బోధాంశుభిః
బ్రహ్మానందయతేః పదాబ్జయుగళం వందే శివం దేశికం.

ఉ॥ ఎవ్వనిచూపువెన్నెలలఁకే మన మోహతమంబు విచ్చునో
ఎవ్వని వాక్సుధన్ జెవులఁ నించిన మూగ లుపన్యసింతురో
ఎవ్వని చిత్ప్రబోధము గఁడించి జగంబులు మేలుకాంచునో
అవ్విభు బ్రహ్మతీర్థుల సఁహర్నిశమున్ మది నిల్పి కొల్చి యీ
మవ్వంపుఁగబ్బ మా గురుసఁమర్పణముంబొనరించి మ్రొక్కెదన్.

# విషయసూచిక.

## కవిమనవి.

ఓం



# నియోగీశ్వరము

## దీక్షితసంస్తుతి.




నారీహృదయాబ్జవాస! నిగమ
శ్రేణీరసోల్లాస! వి
జ్ఞానానందమయాంతరంగ! త్రిజగ
త్కల్యాణశోభాంగ! స
న్మౌనీంద్రస్తుతపుణ్యమూర్తి! శ్రుతిక
ర్మప్రాప్త ధీస్ఫూర్తి! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజా నియోగీశ్వరా!

2 శ్రీనవ్యప్రతిభావిలాస! సుగుణ
శ్రీసంపదుల్లాస! వి
ద్యానైపుణ్య వికాస! దుష్టజన సం
హారప్రభాసా! స్వక

ర్మానుష్ఠానపరాయణైక సుమన
స్సౌఘోద్భవానీక ! ల
క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

3 శ్రీనిత్యప్రభుతావినోద ! గుణరా
శిప్రిస్ఫుటామోద ! సం
ఘైనైర్మల్యనిధాన ! పావన నియో
గిక్షేమసంధాన ! దు
ర్మానచ్ఛేదధురీణ ! భక్తజనతా
త్రతాణపారీణ ! ల
క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

## అవతారము

4 మానింపం దగు దేవతావళికి దు
ర్మార్గంబు వాటించి యెం
తే నీచంబుగఁ జూచుచుండు దనుజా
నీకంబు శోకంబులన్
హాహానాహానము సేసినట్టిహరి దీ
నోద్ధారుఁ డీ వయ్యు ! ల
క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

5 ఏనాఁ డీశ్రుతిధర్మముల్ చెడునో నాఁ
డే నేను జన్మించి మీ
హానిన్ బాపుదు దుర్మతాంధులను జ
క్కాడింతుఁ బొమ్మంచు మున్
శ్రీనారీధవుఁ డొప్పినట్లు జరిపిం
చెన్ మిమ్ముఁ బంపించె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

6 మానింపంబడు పుణ్యమూర్తులకు సా
మాన్యంబుగా నీశ్వరా
ధీనప్రాభవ మబ్బియుండు నెపుడున్
దేవత్వ మా దేహిలో
లీనంబై చరియించు నందు రిది నీ
లీలల్ వెలింబుచ్చె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

వంశము

7 నేనే భూస్థలి జన్మమందిదురితా
నీకంబుఁ బోకార్చి శ్రు
త్యానందం బొనగూర్చునట్టి విమ
లాద్వైతంబు నల్దిక్కులం

దానం బంపెద నన్న శంకరుల ర
య్యా! నందిరాడ్వంశ! ఆ
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— నివాసము —

8 శ్రీనాథుండు వికుంఠపట్టణమునన్
జెల్వొందుచుందాన, గౌ
రీనారీధవుఁ డంబికాసహితుఁడై
క్రీడించు కైలాస సం
స్థానంబుంబలె, రేపలీపురి భవ
ద్ధామంబుగా వెల్గు ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— జననము —

9 ఆనారీ చినమాంబగర్భమున ఘం
టార్యప్రభాంకూరసం
తానంబై ధర వెల్గు శాలిశక హా
స్త్రామ్నాయమానీందు (౧౭౪౨) వ
స్థానన్ గల్గు ప్రమాదిలో నవమి జ్యే
ష్ఠజ్యోత్స్నలన్ దూగుచున్
జానా యుత్తరతారయందుఁ దులలో
జన్మించి దీపించు ల

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## —— జననీజనకులు ——

10 నానాచింతల మానియోగు లతిస్థై
న్యం బందఁ దన్మానస
గ్లానిన్ బాపఁదలంచి సర్వవిబుధా
హ్లాదంబుగా నారసిం
హానూనాకృతిఁ బూని వచ్చితిరి చి
న్నాంబాతనూజాత! ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

11 శ్రీనారీపతిపాదపద్మయుగళీ
సేవాసముల్లాస మా
మీ నవ్యప్రతిభాంతరంగమున స్వా
మీ! భక్తసంత్రాణదీ
క్షానందం బిగురొత్తఁ బుట్టితిరి ఘం
టార్యప్రభాంకూర! ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## —— విద్యాభ్యాసము ——

12 నానాటన్ శిశుభావమున్ విడిచి వి
న్నాణంబుతో వర్ధిలం

గా నైదేండ్లకు నొజ్జయొద్దఁ జదువం
గాఁ బంప నత్యల్పకా
లానన్ సర్వము నేర్చితీ వవుర! క
ల్యాణప్రభాపూర! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

## ఉపనయనము

13 మీనైపుణ్యముఁ జూచి బంధుజనముల్
మెచ్చంగ హెచ్చైన మో
దానన్ ఘంటయసూరి భూరిశ్రుతివి
ద్యల్ మీకు నేర్పింప నెం
తో నిష్ఠాత్మత నెన్మిదేండ్ల కుపనీ
తున్ జేయఁడే మిమ్ము ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

## వేదార్థజిజ్ఞాస

14 ఆనాఁ డల్ల వసిష్ఠసన్నిధినె సం
ధ్యావందనప్రోక్త మం
త్రార్థమ్ముల్ గలిగిన యర్థమున్ గనెదు ను
త్సాహంబుఁ జూపించి వి
జ్ఞానస్ఫూర్తిని వెల్లడించితిరి మీ
సామర్థ్య మేమందు? ల

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## రాజసన్మానము

15 ఆనాఁటం గల రాజపూజిత సద
స్యాదేశముల్ ఫారశీ
లోనన్ భాసిలు నట్టిభాష తమలో
లోపింపకే వెల్గుటన్
భూనాథుండగు జంగనాధిపతి మి
మ్మున్ సత్కరింపండె! ల.
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## వివాహము

16 మీనైర్మల్యము సత్ప్రవర్తనము సం
ప్రీతిన్ విలోకించి పూ
ర్ణానందంబున సుంకరాన్వయుఁడు బం
గారయ్య పుత్రిన్ వివా
హానన్ మీరను నిచ్చె మీ, కతనిభా
గ్యప్రాప్తి కేమందు! ల.
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## సహపాతిద్వేషము

17 'తానం బాడి విభూతిఁ బూసిన యథా
ర్థ బ్రాహ్మణత్వంబు మీ
లో నెట్లొప్పెడుఁబో? నియోగికులజుల్
భూదేవులా? విప్రస
న్మానానర్హులు, మీరు 'రాజు' లను నిం
దావాక్య మేనీతి? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

18 ఏనాఁ డెంతకు లేఁడు విశ్వపతి తా
నే శేషవాల్మీకి యై
మీ నేస్తం బొకపూరికిన్ గొనక 'యే
మీ! మాకు మ్రొక్కంగ లే
వా! నీ కెక్కడి విప్రజన్మ' మన లే
దా? వానితో నేమి? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

## వేదవిద్య

19 "పో, నీకేటికి వేదవిద్య" యని కో
పోద్దీప్తిమై లోభిచం
దానన్ మీకనకయ్యదీక్షితులు నిం
దాడంగ నేమాయె? మో

దానన్ శ్రీ నరసింహదేశికులయొ
ద్దన్ విద్దె రాలేదె ? ల
శ్రీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజాని యోగీశ్వరా !

— శ్రోత్రియత —

20 స్నాన ధ్యాన తపో జపాది బుధస
న్నాహంబు పాలించి మెం
తో నాస్తిక్యము మోహములం దలరఁ జే
తోభీతిఁ గల్గించు వి
ప్రానీకంబులు శ్రోత్రియప్రథను దా
ల్పన్ శక్య మౌటెట్లు ల
శ్రీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజాని యోగీశ్వరా !

— సహపాఠికిఁ బ్రత్యుక్తి —

21 నానాశాస్త్రవివేకవైభవనిధా
నం బైన విద్వాంసుఁడే
దా నీర్ష్యన్ దిగనాడఁ దట్టియెడ నీ
దర్పంబుఁ జూపించి నా
పై నీసున్ బచరించు టెంతపని వి
శ్వప్పా ! పోశాల్మంటి ల
శ్రీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజాని యోగీశ్వరా !

22 "పోనీ క్షత్రియులే నియోగు లని ప
ల్కోఁకల్ వెలింబుచ్చి త్రా
నా నీ తెల్వికిఁ జాలు రాజపదవి
న్యాసంబుచే క్షత్రియుం
డౌనా మున్నల రాజవిద్య యన వ
హ్వా! రాజుకే విద్దె?" ల.
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

గురుకోపము

23 ఆ నిర్యోగమె మీ నియోగ మని వి
ద్యాదాత మిమ్మింటికిన్
రానియ్యం దగదంచు శాస్త్రమును నే
ర్పన్ మానెగా, నంతమా
త్రానన్ బీటలమీఁదిపెండ్లి యెటు గుం
డ్రా డాచినన్ డాగు? ల.
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

మేధాశక్తి

24 మీ నైర్మల్యము మీ యశోవిభవమున్
మీ బ్రహ్మతేజం బెటుల్
కానంజాలును గ్రుడ్డగూబలు జగ
త్కల్యాణ కుల్యానటల్

ధీ నైపుణ్యముఁ జెట్టపట్టితన నెం
తే విద్య మీ కబ్బె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

25 మీ నూత్నద్యుతి, బుద్ధివైభవము, వా
గ్మిత్వంబుఁ గన్నారఁ దాఁ
గానంజాలక మిమ్ముఁ బొమ్మనియె నాఁ
గా కేమి యున్నేకసం
ధానగ్రాహికి విద్య లెందుఁ గొదువౌ
నా ? దేశికాధీశ! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

26 దీనోద్ధారకుఁ డా రమాధవుఁడు ని
ర్దేశించిన స్త్రీ ధరా
గ్లానిన్ దీర్పఁగఁ బుట్టువారు త్రిజగ
త్కల్యాణసంపాదమా
శ్రీనైర్మల్యవిశిష్టవైభవముతో
దీపింతురి నిన్ బోలి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

పునర్విద్యాభ్యాసము

27 ఆనాఁ డక్కనశాస్త్రి యన్ గురుఁడు వి
ద్యారాశి, తన్మండలీ

ధానిం గర్తపురిం వసించుతటిం ద
త్సాన్నిధ్యమం దట్లు వి
ద్యానై పుణ్యములం గడించితిరి కా
దా? మీకు లో టేది? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

అక్కన్న గురు నిష్ఠాష్టకము

28 మానింపందగు పాండితీభరితుండుం
భద్రాత్ముండుం శుద్ధవి
ద్యానిర్మాలితమత్సరుం డయిన య
క్కన్నార్యుం డాత్మీయశా
ఖానిందల్ గమనింపకే చదువు దీ
క్షం జెప్పెండే మీకు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

29 లోనం బుట్టు వివేకదీప్తి పురికొ
ల్పంబో సమత్వంబు న
జ్ఞానుల్ కొందఱు మీరు మే మనుచు
నానామీనమేషంబు లెం
తేనిం లెక్కిడుచుండ్రు వేత్తల కిదే
హేయంబుంగాం దోంచు ల

క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

30 దీనోద్ధారకు లార్తరక్షణకళా
ధీనాంతరంగుల్ మనీ
షానిర్ధార్యులు చిత్కళాభరణభా
స్వత్పూర్ణిమాచంద్రు లా
జ్ఞానుల్ సర్వజగత్సముల్ పరుల నీ
ర్ష్యన్ జూడఁగా లేరు ల
క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

31 తానే నేర్చితి నంచు మిట్టిపడి వి
ద్యాదానమం దాసలే
పూనం జాలని బద్ధమత్సరుఁడు దు
ర్మోహాంధ ఘోరాటవిన్
జానై పండెడు వ్యర్థసాలతరువై
నాశిల్లఁడే స్వామి ! ల
క్ష్మీనారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

విశ్వపతి దురాగతము

32 హీనాత్ముండగు విశ్వపుం డపుడు తా
నేతెంచి యక్కన్నతోఁ

నానాభంగులఁ గొండెముల్ వలికి "య
న్నా! వీఁడు విద్వేషి సు
మ్మీ; నీచాత్ము నియోగిఁ, దాను మనతో
నేసాటి యన్నట్టి దు
ర్మానిన్ వెంటనె గెంటివేయు" మన నే
మాయెన్ జివాట్లబ్బె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

విశ్వపతి పరీభూతి

33 "కాని మ్మోరి నియోగివైదికుల కే
కత్వంబె సిద్ధించుఁ గా,
కానే యిట్టి విభేదబుద్ధి మనకే
నా బ్రాహ్మణత్వంబు? ఛీ!
పో నీనీతికి మెచ్చికొంటి" ననఁడే
పుణ్యాత్ముఁ డక్కన్న, ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

ద్వేషలాభము

34 తా నటఁగాడిన యుక్కశాస్త్రిఁ గనినం
తన్ దమ్మిడీమోముతో
మానంబంతయు హూనమై తుదకుఁ గొం
పన్ జేరి లజ్జాపరా

దీనస్వాంతతఁ గుందె విశ్వపతి యిం
తే ద్వేషలాభంబు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— భార్యావియోగము —

55 ఆనందంబుగ ఘంటసూరి శ్రుతిక
ర్మాధారసంభావితా
ధానంబుం బొనరించె నంతట భవ
ద్భార్యావియోగంబు చి
త్తానన్ గారియవెట్టెఁ జిన్నతనమం
దత్యంతశోకంబొ! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— పురోహితకోపము —

56 దీనుండై స్నుషపోయె నన్నవగ నెం
తే కర్మలం జేయఁగాఁ
బూనన్ మీకసకయ్యదీక్షితులు రాన్
హొమ్మన్నఁ దాటాకుపు
స్తాన్ నేరిచి తండ్రిచే నపరమున్
సల్పించితౌరౌర! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

అక్కన్న గురుప్రశస్తి

37 తానంతన్ భవదంగనామరణవా
ర్తన్ విన్నమాత్రాన లో
లోనన్ గుందిన యక్కసూరి, మనమే
లున్ గోరి నానాంట రా
రానీ తెల్వికి మెచ్చి వ్యాకరణ త
ర్కంబుల్ బఠింపించె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

38 భానుపరిస్ఫుటమైనదీప్తి గల వి
ద్వత్సారు లావార లెం
దేనిన్ గొంచెపుసేతకుం జొరక నీ
తిన్ వీడం గాం బోక తి
ష్ఠానుగ్రాహకు లౌచు నిష్కపటవి
ద్యాదానదీక్షాసమా
ధానం బా మన మంది శిష్యులం దమం
తన్ జేతు రీ రట్లు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

గురుదక్షిణ

39 మీనైపుణ్యసుపుణ్యవర్తనలకున్
మెప్పొంది యక్కన్న మో

లానఁ వేదము నేర్పితౌర! జగదా
హ్లాదంబు సంధిల్ల ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

ద్వితీయవివాహము

42 శ్రీనారీమణి నిచ్చె మాధవునకుఁ
క్షీరాబ్ధి, గౌరీసతిఁ
దా నిచ్చెఁ హిమవంతుఁ డాశివునకుఁ,
దదీతి మీ కిచ్చెఁ బూ
ర్ణానందంబుగ రాయమంత్రి నిజక
న్యఁ గోటమాదేవి ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

కడలూరుప్రయాణము

43 తా నుద్యోగముఁ జక్కఁబెట్టుటకు బ
ద్ధప్రీతిఁ గృత్తింటివం
శానఁ వెల్గెడు రామమంత్రి కడలూ
ర్సాగఁ దలంపూని ల
శ్రీనాథప్రతిమాను నిఁ బిలిచి 'ర
మ్మా పోద' మం చాడె ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

26200
25-3-13

## భాష్యత్రయశాంతి

44 ఆనాఁ డాకడలూరు కేగి నిజవి
ద్యానైపుణిఁ జూపి భూ
మానందుం డగు రామచంద్రయతిపా
దాంభోజసాన్నిధ్యమం
దే నిష్టం గని సర్వభాష్యచయశాం
తిఁ సల్పి తౌరౌర! ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## కడలూరుపండితులు

45 మానింపందగు మీసునైనిపుణతల్
మన్నింపఁగాలేక రో
షానన్ బండితకోటి కీర్ష్య మది హె
చ్చన్ బోఁగా వచ్చిరే?
ఔనౌ దాగెడిచోట దయ్యములు తో
డై వచ్చిన ట్లయ్యె, ల
శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## ధ్వాంతవిజయము

46 "కానీ! బాలకుఁ డెంత? పో" మ్మనుచుఁ గి
న్క మధ్వసిద్ధాంతశా

ఖానిష్ణాతులు దాడికెత్తి తమపైఁ
గయ్యాంబు సాగింప మీ
ధీనవ్యప్రతిభాబ్ధివీచికలయం
దే ద్వైత మడ్గంచె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

47 మీ నేర్పుల్ గనులారఁ గాంచి మదిసం
ప్రీతిన్ వివేకించి మా
ధ్వానీకంబులు సర్వపుస్తముల మీ
కర్పించి "మీమాంసశా
స్త్రిన్ గల్గిన ధర్మమున్ నిలుపు మా
ర్యా!" యం చని గ్గాదె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

— తీర్థయాత్ర —

48 మీ నేస్తంబున రామమంత్రి బహుంక
ర్మిష్ఠుండునై యాత్రికై
పూనన్ శిష్యులఁగూడి వారివెనుకన్
బో మీరుతీర్థంబులన్
స్నానాదిక్రియ లాచరించితిరి పూ
ర్ణానందసంపన్న! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

## పునరాగమనము

49 తానాపై రుజఁ గుంది గ్రామవిభుఁ డం
తంబంద కామేశ్వరా
ర్యానందార్యుల మిత్త్రిపుత్త్రికుల మీ
రల్ బందరుఁ జేర్చి యెం
తేనిష్ఠన్ శ్రుతిపాఠశాల మరలన్
నిల్పించి తౌరౌర! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## బంధుయాజనము

50 నానాఁటన్ బదిరెండుమాసములు చ
న్నన్ దండ్రిశ్రాద్ధంబు రాఁ
గానన్ దత్సుతుఁ డెవ్వరిన్ దిథికి భో
క్తల్ గా నిమంత్రింతు నం
చానన్ బల్కు నియోగిబ్రాహ్మణులనే
యర్చింపుఁడీ యంచు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## రేపల్లె వేదపాఠశాల

51 తానొక్కండట ఘంటదేశికుఁడు వే
దాధ్యాపనప్రక్రమా

ధీనుం డయ్యెను రేపలీనగరిలో
దేదీప్యమానంబుగా
నానందించిరి వేదపాఠనిలయం
బబ్బెఁ గదా యంచు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— కులపతిత్వము —

52 పాణిన్ బెండక శిష్యులందు శ్రుతివి
ద్యాదీప్తి వర్ధిల్లఁగా
నా నేమంబుల నేర్పుచోఁ గులపతి *
వ్యాపారతాపారమై
మానాత్మప్రతిభల్ దిగీశ్వరులతో
మేలంబు సాగించె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— గురుసంతోషము —

53 ఆనందంబుగఁ దండ్రియున్ సుతుఁడు వే
దాధ్యాపకస్థానదీ
క్షానిర్వాహకు డౌటఁ దా నెఱిఁగి య
క్కన్నార్యుఁ డత్యంతమో

*పదివేల బ్రాహ్మణ విద్యార్థుల కన్నదానాదికము లిచ్చి వేదాధ్యయనము సేయించు విప్రుఁడు కులపతి యనఁబడును.

దానన్ శుక్రబృహస్పతుల్ నెఱపుచుం
దంబయ్యె నంచాడె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— అంత్యాశాంతి —

54 హీనాత్ముల్ భవదీయకీర్తికి మనం
బీర్ష్యాకులంబౌటఁ బ
త్రాన్ వ్రాయుచు లేనిపోని గురునిం
దావాక్యముల్ పీఠసం
స్థానాధీశుల కంపి రొక్కమెయి నాం
త్యాకాంక్షులం బొంచుచున్
మానంజాలునె తేలుకొండి విసమున్
వర్షింపకుండంగ? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— జనకసిద్ధి —

55 ఆనంతర్యము ఘంటధీవరుఁడు స
న్న్యాసంబుఁ గైసేసి బ్ర
హ్మానందాఖ్యయతీశ్వరుం డగుచు వి
ద్యాదానమున్ సల్పి మో
క్షానందంబు గడించెఁగాదె బుధవ
ర్యా! యోగసిద్ధుండు ల

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

### రేపల్లిలో వేదబోధ

56 తా నస్తంగతుఁ డయ్యెఁ దండ్రి, యిఁక వే
దాధ్యాపనల్ రేపలిన్
బూనంగల్గినవారు లేమి నటకున్
బోఁగోరి మీశిష్యు నె
ల్లేనిన్ బందరుపాఠశాలపయి ని
ల్పించిర్గదా నాఁడు ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

### గురుచిత్తనైర్మల్యము

57 “ఫో, నీకేటికి వేదవిద్య” యని మున్
బో నెట్టి రేమాయె? మి
మ్మే నిప్డున్ గనుచున్ దివాకరణపున్
మేటుల్ బడిన్ జేరి మీ
చే నేర్పంబడి సర్వశాస్త్రముల వా
సిన్ గాంచరే నేఁడు ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

58 కానంజాలని బ్రాహ్మణాధములు దీ
ర్ఘక్రోధవహ్నిప్రభా

ధీనస్వాంతులుగాని, తత్త్వమును గు
ర్తింపంగలా రెల్లలోఁ
బూనన్ జాలరు కోప మొక్కనిముసం
బున్ మిన్నులంబోలి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

59 తేనెల్ జిల్కు భవద్వచోరచన కెం
తే సంతసం బొంది శి
ష్యానుగ్రాహకచిత్తదీధితులఁ బూ
ర్ణానందముల్ గాంచి మీ
చే నధ్యాపితులైరి వైదికులె ద్వే
షింపంగఁబో కౌర! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

60 జో, నెవ్వా డుపకార మిచ్చెదరొ ము
న్నవ్వారి కవ్వారిగాఁ
దానున్ బ్రత్యుపకారముల్ సలుపు చి
త్తం బూనులోకంబు; ద్వే
షానన్ గెంటిన కొంటెవారలకు శి
ష్యత్వంబు నిప్పించి మీ
ధీనైర్మల్యదయామహాత్త్వముల సం
దీప్తంబుఁ గావింతె? ల

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

ధృష్టద్యుమ్నవధ

61 భానుం డంబరవీధి వెల్గుతఱి భూ
భాగంబునన్ గోటికీ
టానీకంబులు గాలిలో ముసరుచా
యన్ శత్రువర్గంబు రో
షానన్ మిమ్ముల నొంటిగాఁ బొదివి ధృ
ష్టద్యుమ్నసంహార మె
ట్లేసన్ జేతుమటంచు డంబములఁ గా
ట్టైన్ గాని శక్యంబె? ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

శుష్కవిద్యావిలాసము

62 కానన్ రాని తమిస్రమున్ బెనుచు శు
ష్కప్రీతివిద్యారసా
ధీనుల్ తేజముఁ జూడఁజాలక దివాం
ధీభూతులై సర్వగ
ర్వానర్థంబులఁ దెచ్చిపెట్టుదురు, దే
వానాంప్రియుల్ వీరె, ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

### భాగవతలక్షణము

63 రానైయున్నది రాకమాన దని ధీ
రస్వాంతు లెందే నుదా
సీనుల్ గావున దుష్టవర్తనులు గా
సింబెట్టుచో "కింక" మం
చేనాఁడుర్ బదులొగ్గి భాగవతధ
ర్మేచ్ఛన్ విడంబోరు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### విజ్ఞానిహృదయము

64 నానావిద్యల నీటు ద్వేషమును మా
న్పంజాల దట్లుండ వి
జ్ఞానానందమయాంతరంగమున మా
త్సర్యపరిభావంబు కా
లూనం గల్గునె పొట్టపోసికొను వి
ద్యోద్రేక మేమందు? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### ఆధానము

65 నానారీతుల నొక్కిచెప్పవె శ్రుతుల్
"నానాహితాగ్ని" ర్యటం
చానందాబ్ధమునందు వేదహితక
ర్మాధారమైనట్టి యా

ధానంబుల్ సలుపం దలంచితిరి, త
త్సంకల్ప మీఁడేరె, ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

— ఉపాసనబలము —

66 ధ్యానానందసమాధిసంఘటితమే
ధాదక్షిణామూర్తి పూ
జానుప్రాప్తమనోవికాస మను బ్ర
హ్మానందకందంబు మీ
లోనన్ వర్ధిలి పూచి కాచి విలసి
ల్లున్ గల్పకంబట్లు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

— సోమయాగము —

67 కాని మ్మెన్నొక సోమయాగమును సం
కల్పింతు నం చెంతో మో
దానన్ రాక్షసవత్సరంబుననె త
ద్యాగంబు సాగింపఁగా
మీ నవ్యప్రతిభాలతల్ వెసలఁ గ్రి
మ్మెన్ సోమయాజీశ! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

—— ఋత్విక్స్థానము ——

68 మానింపం దగు బంధులన్ విహితక
ర్మప్రాప్తవాక్సింధులన్
దీనవ్యప్రతిభావియోగులను ఋ
త్విక్స్థానమున్ దుంచి బ్ర
హ్మానందంబుగ యజ్ఞదీక్ష నెఱపన్
బ్రాప్తించె మీ కౌర! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

—— శేపల్లి తిక్కన్న ——

69 ఆనాఁ డేకవి - మంత్రి - సోమపులఁ ది
క్కార్యాదులన్ గాంచఁ జే
తోనైర్మల్యనియోగిలోకమున కెం
తో కీర్తి సంధిల్లె; న
ట్లీనాఁ డిందుల యజ్వ - మంత్రి - కవిరా
ట్కీర్తిప్రభుల్ మీరె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
— శ్రీజానియోగీశ్వరా!

—— సప్తపశుదీప్తి ——

70 సావంబాశ్వరదీక్షఁ జూచి ఖిలు తీ
ర్థ్యావేశముం బొంచి మీ
పై నెంతేనియుఁ గంటగించుకరిఁ ద
ద్వాదంబుఁ బోకార్చి లో

కాన నిల్పితి కార! పిష్టపశుయా
గప్రక్రియోద్దీప్తి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

కర్మభ్రష్టత

71 మీ నవ్యాద్భుతశాస్త్రచర్చలకు ను
న్మేషంబుగా వారు లో
లోనన్ బెగ్గిలి బారుబూరు మను చె
ట్లో నాల్గుశ్లోకాలు మీ
పై నల్లించిరి కర్మభ్రష్టు లని దు
ర్వాదంబులన్ బెంచి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

కవితాసిద్ధి

72 నానావిద్యలు నేర్చినంత కవితా
నందంబు నందంగ వీ
లౌనా? ప్రాక్తనపుణ్యకర్మఫలలే
శాధీన మీభాగ్యమెం
దేనిన్ రేల్ బవ లేడ్చినన్ జడుల కే
వీ? సంతతుల్ స్వామి! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### అభియోగము

73 నానాఁటన్ గసివోవకే మసిని మే
నన్ బూసికొన్నట్లు లా
హీనాత్ముల్ గుదిగొన్నకోపమున వ్యా
జ్యేచ్ఛల్ మదిం బెంచి మీ
పైఁగన్ దా రభియోగముల్ బరపి దౌ
ర్భాగ్యంబు పాత్రైరి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### విశ్వపతి యుద్బోధ

74 'ఏనాఁ డీనొసటన్ లిఖింపఁబడెనో
యీబిచ్చపుంగూఁడు మీ
రీ నీచాత్ములయొద్ద విద్దెలను నేఁ
డే మానుచున్ గొంపకున్
బో నెంతో శుభ' మంచు విశ్వపతి సం
బోధించె శిష్యాళి, ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### దుర్యుక్తిఖండనము

75 ఆనిర్భాగ్యకుతర్క వాగ్విలసన
వ్యాపారముల్ జూచుచున్

గానిమ్నం చూక 'విశ్వపాఽసురజయ'
  గ్రంథంబు నిర్మింపరే?
జానొపద్ధతి వర్ణికిన్ "భవతి! భి
  క్షాం దేహి" యేకాదె? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
  శ్రీజాని యోగీశ్వరా!

దీక్షితప్రశస్తి

76 నానాటన్ నిజశ్రౌతమార్గములు వి
  న్నాణంబుగా హెచ్చుటన్
జానై "దీక్షితపద్ధతం" చనిరి, భా
  స్వత్పాఠశాలాళి కా
పైనన్ "దీక్షితపాఠశాల" లను శ
  శ్వత్ ఖ్యాతిసేకూరె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
  శ్రీజాని యోగీశ్వరా!

పద్ధతిరీతి

77 మీ నూత్నంబగు పద్ధతిన్ నడుపఁ గం
  పించి ర్ని యోగిప్రభుల్
మీ నూత్నంబగు పద్ధతిన్ నెడపఁ గం
  పించి ర్మహా వైదికుల్
కానంజాలనివారి కెన్నిదివిటీల్
  కాల్పింపఁ గన్పించు? ల

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— నియోగి భీతి —

78 పోనీ మూరెడుపాటిచుట్టుపాగసొం
పుల్ చంపుకోలేమినో
కూనల్ పెంచెడి కోరమీసముల సోఁ
కుల్ మానుకోలేమినో
మీ నూత్నప్రభ మానియోగులకుఁ గుం
భీపాకమై తోఁచెల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— పురోహితభీతి —

79 స్థానంబందలిగౌరవం బరసి శ్రౌ
తస్మార్తవిధ్యుక్తక
ర్మానుష్ఠానములన్ నియోగి నడిపిం
పన్ గల్గుటన్ గొప్పక
ష్టానన్ వోఁగు పురోహితప్రతతి నో
టన్ గడ్డ వడ్డంతరా
గా నీమార్గము మట్టగింప మది సం
కల్పించినారేమొ ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

——— శంకరాగతి ———

80 ఆనాఁ డట్లు మఠాధినాథులకుఁ గ్రో
ధావిష్టవిశ్వప్ప వ
త్రిన్ వ్రాసిన కొండెముల్ సదివినం
తన్ శంకరాచార్యు లా
గ్లానిన్ బాపఁదలంచి వచ్చి రది సం
ఘక్షేమమే గాదె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

——— ఆచార్యకోపము ———

81 రాణన్ నేను మఠాధిరాజు నని గ
ర్వస్ఫూర్తి దీపింప నెం
తో నిష్ఠన్ *గుసుమాద్రిశంకరగురుం
డూరేగుచున్ వచ్చి మీ
పైనన్ గొండెములన్నియున్ వినుచుఁ గో
పం బాత్మలోఁ బెంచె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

——— సమావేశము ———

82 మీనేర్పుల్ గనలేనిశంకరులు సం
ప్రీతిన్ సభన్ గూర్ప వి

* పుష్పగిరి.

ద్యానిష్ఠన్ బ్రకటించి శాస్త్రమున వా
క్యార్థంబుఁ గావించి వై
రానీకంబుల మాసకాలమునఁ ద
ర్కాంభోధి మున్గింతె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

శంకరపలాయనము

83 తా నేమో మిము శిక్షసేతు నని బ
ద్ధప్రీతి నేతెంచి యెం
దేనిన్ మీయెడఁ దప్పు కన్పడమిచే
నేతీర్పు నీకుండ మా
నానన్ గాలికి బుద్ధిసెప్పి గురుఁ డ
న్నా! యాంత్షు లేమయ్యె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

భాష్యసమస్కృతి

84 మీ నేర్పుల్ పచరింపఁబోవుతఱి స్వా
మిన్ గూర్చి సాష్టాంగస
న్మానంబుం బొనరింపకుండనె జగ
న్మానార్హా! కైలాసనా
థానూనోదితసూత్రభాష్యమును జో
హార్లంటిరే స్వామి! ల.

శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

— సంకరచర్య —

85 ఏనాఁడైనను ధర్మరక్షకులు మ
న్నీరీతిఁ గావించిరే
మానం బంది పలాయనక్రమము స
న్మానించిరే యంచు మ
న్నానాఁ డాగురుసంకరోత్పథముఁ దూ
ర్వారంగఁ బట్టింతె! ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

— విజయము —

86 మానం బూడిచిపెట్టి విశ్వపతి మ
మ్మా రోడె, నాబావతోఁ
దా నోడెన్గద మేన్మఱంది, తుది మా
త్సర్యపరిపూర్ణాత్ములై
యానాఁ డచ్చటివారు లోడి, రిఁక సా
హాయ్యంబుగా వచ్చి బ్రి
హ్మానందంబుగ స్వామి లోడిరి, భవ
న్మాహాత్మ్య మే మందు! ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### భట్టిప్రోలు నిర్బంధము

87 తా నస్లేమియు గెల్పు సెప్పకయ వి
ద్వత్ శంకరుల్ భట్టిప్రోల్
బో నాచోటన విప్రులందఱును దీ
ర్వన్ జెప్పమం చాడరే
పూనంబట్టినకర్మ మెందుఁ బోరుగా
ర్వోఁగాక పోదండ్రిల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### పుండ్రవిధి

88 శ్రీవిశ్వాత్మనియోగివంశజనితుల్
ఛిద్రోర్ధ్వపుండ్రింబులన్
బూనన్ గూడ దటంచుఁ గట్టడిని సం
బోధించి బోధించి నాఁ
డానామాలను మాన్పఁ దిర్పితిరిగా
బా! దీక్షితాధీశ! ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

### శాస్త్రచర్చ

89 తా నంతన్ "విధవావివాహములు శా
స్త్రప్రోక్తధర్మంబు ల

ద్దానన్ జెల్లు"నటంచుఁ జాటుతఱి వి
ద్యాసాగరుం డట్టి దెం
తో నిష్ఠన్ శతఖండజర్ఝరితమ
ట్లూఁగించి తూలింతె! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

ఖండనగ్రంథనిర్మాణము

90 మీనేర్పుల్ గని డీకొనందలఁచి రం
పిల్లన్ బుధంమన్యులో
కానీకంబులు హింగురామప్రముఖా
హంకారపంకంబు మీ
ధీసిద్ధాంతముగా నొనర్చితిరి కా
దే ఖండనల్ వ్రాసి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

శ్వశ్రుతిరస్కృతి

91 మీనేర్పంబడు వేదమంత్రతతిలో
మీమామ యెద్దేవరున్
బూనన్ దన్మతిఖండఖండమగు చా
ప్పన్ రాయరక్షోజయుం
బే నిర్మింపరె! ధర్మరక్షకుల కే
దీ పక్షపాతంబు ల

శ్రీమన్నారాయణ ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా !

## సువర్ణపుష్పజిగీష

92 ధీనవ్యప్రతిభన్ దెసల్ గెలుచు దీ
ప్తిన్ దక్షిణామూర్తిసం
జ్ఞానిష్ఠం గని దాక్షిణాత్యుఁడు జిగీ
షన్ మిమ్ము రాఁబిల్చుచున్
దా నూర్బంగరుపూలఁ బెట్టి తమితోఁ
దర్శించి మున్నోడె మీ
కానాఁ డాశతహేమపుష్పముల న
ట్లర్పించి పోలేదె ? ల
శ్రీమన్నారాయణ! కీర్తిభాస్వర ! సుర
శ్రీజానియోగీశ్వరా!

## దిగ్విజయము

93 మీనూత్నద్యుతిన్ సుప్రభకు ను
న్మేషంబు సంధిల్ల హా
ర్షానన్ శంకరులట్ల దిగ్విజయమున్
సాఁగింపఁబోరే సశి
ష్యానీకంబుగ; రాణ్మహేంద్రపురిఁ జే
ర్చుంబడ్డ విద్వత్సభా
స్థానంబందున నొంటిఁ బోరి జయమున్
సాధింప రే నాఁడు ల

శ్రీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— ప్రత్యక్షశంకరులు —

94 జ్ఞానానందమయస్వరూపు లగు సా
క్షాచ్ఛంకరుల్ భాతి మీ
రానాఁ డల్ల సభాస్థలిన్ నిలిచి వా
క్యార్థంబుఁ గావించు చం
దానన్ మండనమిశ్రశంకరవివా
దాస్థానమట్లుండె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

— నాయఁడుపోరు —

95 ఆనాఁడే మిము గెల్వఁజాలని సద
స్యానీక మెంతెంతో దుః
ఖానన్ నాయఁడు వేంకటాద్రి మన ది
క్కౌం చేగిరన్ దన్మనో
గ్లానిన్ దీర్పఁగ నాతఁడున్ దొడరి గె
ల్వన్ లేమిఁ జింతిల్లె, నెం
దేనిన్ మిణ్గురు లాసుధాకరుని బం
ధింపన్ దరంబౌనె? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

## పద్ధతివర్ణన

96 మానింపందగు తాపకార్యపథముల్
మఱిందింప నే రెంతగాఁ
బూనన్ లాభముకల్గునో కో దురితాం
భోరాశి దాఁటించి శుని
త్యానందం బిడునట్టిమార్గముల కా
రా! కీడు రాఁబోదు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

## సిద్ధాంతము

97 పూనంగావలె వేదకర్మనిచయం
బుల్ జిత్తసంశుద్ధికై
మానంగావలె భేదభావము జగ
న్మాన్యత్వ సంప్రాప్తికై
దానంజేసి లభించు ముక్తియని కా
దా మీరు బోధింతురే ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

98 పూనం గావలె నిండు నమ్మకము నె
ఘ్నుల్ వేదబోధంబులన్
మానం గావలెఁ బో నధఃపతితసం
బంధాఘబంధంబులన్

దానం బుట్టును ముక్తిమార్గమని కా
దా మీరుబోధింతురు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

99 పూనం గావలె బంధుయాజనము సం
పూర్ణ ప్రభాస్ఫూర్తితో
మానంగావలె ఛిద్రపుండ్రమును ధ
ర్మప్రీతి చిత్తంబుతో
దానం జేకురు సంపదాళి యనికా
దా మీరు బోధింతురు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

100 పూనంగావలె సర్వకార్యకరణం
బుల్ పూర్ణనిష్కాములై
మానంగావలెఁ గామ్యకర్మచయసం
బంధంబు లార్యాత్ములై
దానం గల్గును మోక్షసిద్ధి యని
కాదా మీరు బోధింతురు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

శిష్యవ్యాప్తి

101 శ్రీనవ్యప్రతిభామనోహరులు మీ
శిష్యప్రకాండంబు లెం

తేనీఁ గల్పకశాఖిశాఖ లన వ్యా
ప్తింగాంచి మీసూక్తిదీ
క్షానందంబును నర్తైసల్ బరపి రా
హా! యేమిభాగ్యంబు ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

102 ఓ నిర్ధార్య! మహాత్మ! తావకమత
ప్రోద్ధారకుల్ శిష్యులై
మీనిష్ఠఁ గని రాత్మశిష్యుఁ డొకఁ, డా
మీ దేవరుఁ, బిమ్మటఁ
గానఁ దొమ్మిదిమందియుఁ దరణిసం
ఖ్యాకుల్ గదా యంత, ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

—— ప్రశిష్యప్రచారము ——

103 ప్రాణాధారులుగారె సూరినుతదై
వాద్వైతసంస్థాపనా
ధీనస్వాంతులు మీప్రశిష్యులు యశో
దేదీప్యమానార్య వి
ద్యానందాత్మజు లిద్వరుం గలిసి మీ
ధర్మంబుఁ బోషింతురి ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

సన్న్యాసాశ్రమము

104 ఆనేమంబులతో నియోగిజన సం
ఘాధారమై మీఁప్రభా
భానుం డందఱ నుద్ధరించెఁ బిదపన్
వర్ణాశ్రమాచారస
న్న్యాసం బేర్పడ శ్రీముఖాబ్దమున స
న్న్యాసంబు సిద్ధించె ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

శతకనిర్మాణము

105 శ్రీనూత్నద్యుతి దీక్షితార్యపథ సం
సేవాధురీణుల్ రసా
నూనస్వాంతులు పుణ్యవర్తనులు ముక్
గోటీశ్వరశ్రౌతు లా
ర్యానందైకవిలాసభాసు లగు మా
ర్కండేయశర్మాఖ్యు లి
ద్దానిన్ వ్రాయుమటన్న వ్రాసితిఁ గృతా
ర్థంబయ్యె నాజన్మ ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

సమర్పణము

106 శ్రీ నారాయణుఁబోలి పావనదయా
సింధుండు వేదార్థవి

ధ్యాననిష్ఠాత్ముఁడు బ్రహ్మవర్చసము దే
హంబందిఁ వెల్గొందె నో
కోటానానుజ్వలపుణ్యమూర్తియగు (శ్రీ)
కోటీశ్వరబ్రహ్మ క
త్యానందంబుగ మ్రొక్కి మీశతక మే
నర్పించితిన్; పాహి! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

కథామధురిమ

107 పోనిం డింకులఁ దప్పుబుండ వని నేఁ
బోగాడ నీర్ష్యాత్మచే
రానైయున్నది రాకమానదని ధై
ర్యం బాత్మలో నింపి నా
చేనౌనంతకు మీకథామధురిమన్
సేవించి తింకేమి? ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజాని యోగీశ్వరా!

కవిప్రార్థన

108 మీనైష్ఠిక్యపవిత్రమార్గ మవలం
బింపంగ లేకున్న నె
ట్లో నే దేశికసత్కథావిరచనా
లోలుండ నో దీక్షితా

ర్యా! నన్నచ్యుత వేంకటాచలపతీ!
రక్షింపవే తండ్రి! ల
క్ష్మీనారాయణ! కీర్తిభాస్వర! సుర
శ్రీజానియోగీశ్వరా!

159

---

# కవిమనవి.

## శివస్తుతి

109 ఓసాంబ! సదాశివ! నే
మీా సత్కరుణాకటాక్ష మేదురదీప్తిన్
వ్రాసితి నెట్లొటొ చిన్మయ
భాస! నియోగీశ్వరమును బాలింపఁగదే.

## చిరస్థాయిత్వము

110 ఇందుల హస్తరామగగ
నేంద్రియమా(౧౯౧౩)కలిలోఁ బ్రజాపతిన్
జెందిన భాద్రమాసమునఁ
జెప్పి ముగించితి నీకృతిన్ దయా
మందిర! మీాకృపారస మ
మందగతిన్ జిలికించి దీని ని
ల్పం దలపెట్టు మాశశిది
వాకరతారము చంద్రశేఖరా!

క్షమార్పణము

111 భవదచ్ఛస్ఫుటకీర్తిచంద్రికలు ది
గ్భాగంబు లంటంగ నా
కవితాశక్తికి సర్వముం బొగడ శ
క్యం బెట్లగుం వార్ధిలో
న విశిష్టాంబువులందుఁ బొర్లినను మీ
నం బెల్ల నీరంబుఁ గ్రో
ల వశం బౌనొకొ దీక్షితేంద్ర! నను న
ల్పజ్ఞుం క్షమింపంగదే!

గురుకటాక్షస్తవము

112 నాకుం జెందిన పూర్వపుణ్యబల స
న్నాహంబుచేఁ బిన్ననాఁ
డా కళ్యాణగుణాస్పదంబులగు బ్ర
హ్మానంద యోగీశ్వరా
స్తోకానందకటాక్షదీధితులలోఁ
దూఁగించి నన్ గొంత సు
శ్రీకుం జేసిన పూజ్యపాదయుగళిన్
సేవింతు మోక్షార్థినై.

నిష్కలుషశపథము

113 మీవారం చోక భేదబుద్ధి నవలం
బింపంగ లేఁ; దట్టులే

మాహారం చెదఁ బక్షపాతమును స
న్మానింపలే; దిట్టి స
ద్భావం బేర్పడ మాని యోగిజనతా
ధారున్ గురూత్తంసునిన్
సేవింపన్ దలపెట్టితేని విబుధా
శీస్సుల్ సనున్ జేరుతన్.

వేద విద్వ నతి

114 సాదరబుద్ధి వేదసము
పార్జిత ధీప్రభమించి ధర్మశా
స్త్రోదిత కర్మనిష్ఠఁ బరి
శుద్ధమనస్కతఁ గాంచి జ్ఞాన సం
పాదిత యోగసిద్ధి భవ
బంధవిముక్తిఁ గడించి నేఁటికిన్
వైదికపుణ్యమార్గముల
వర్తిలు విప్రుల పాదధూళి నే
నాదలఁ దాల్చి వేదవిదు
లందఱముందఱఁ జాగిలించెదన్.

కుజననింద

115 అజ్ఞానంబున మీరు మే మనుమహా
హంకారపంకంబునన్
సుజ్ఞానప్రతిభైకదూరు లగుటన్
దోషజ్ఞు లాత్మీయ దో

ప్రాజ్ఞుల్ గావున పాడుఘోరకలిదుా
ష్యంబైన మార్గంబులన్
బ్రాజ్ఞుల్ సూపుచు సూపవేత్త లిటు వి
ప్రద్వేషులైరేమొ; త
త్ప్రాజ్ఞుల్ దుష్టపథానుసారులయి నిం
దన్ దల్లకిందాడురే!

కవినతులు

116 ఓ రసపూర్ణులార! సుగు
ణోత్తరులార! మదీయసత్కృతిన్
నీరసభావ మున్న యెడ
నీరసమంబుగఁ ద్రోసి హంస లె
ట్లారసి క్షీరముల్ గొనునొ
యారసికాగ్రిణిఁ బూని మీరలే
యీరసమున్ త్యజించి కల
యీరసమున్ గొనుఁడయ్య! మ్రొక్కెదన్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

